89

Reg. No. 751

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

189 గుంటూరు.

సంపుటము 34 { 1942 సం॥ జూలై నెల 15వ తేది } సంచిక 4

విషయములు.






చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

**శ్రీమంతు, రాణి ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరుగారు,**

గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు, అఖిలమహోద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్పగిరి

౨ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

3 ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౪ రాజా సురభి వెంకటరత్నాంబ బహద్దరుగారు, రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౫ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౬ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౭ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకర భారతీస్వాములవారు, హంపి.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - దేవిడి

3 కొండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, ఇబ్రహీంపురము.

౪ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౫ చావలి నరసింహావధానులుగారు, బట్టలమిల్లు మేనేజరు, సికిందాబాదు.

౬ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇనుమూరు.

౭ వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు, శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠము - బెజవాడ

# అభినవసరస్వతి

సంపుటము ౩౪ | చిత్రభాను సం॥ ఆషాఢమాసము 1942 జులై 15 తేది | సంచిక ౪


## కృతివిమర్శనము

### చేతావనిఖండనము

రచయిత విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వీరు కవితావినోదము కొండ్లిరాయచారము కవితారచన మొదలగు ననేకగ్రంథముల రచించియున్న సత్కవులు. కవిత్వము గంభీరము రసవంతము. ఈవిషయము వారి కవితారచనలోని దిగువపద్యము తెలిపెడిని.

మ. కవితాకన్యక మనింటి యాఁడుపడుచా? కాపున్న నిల్లాల? లే
క వశంబందున నుండు వారవధువా? కాదిట్టులన్ పూర్వసం
భవమందుంగల పుణ్యలేశమున సంప్రాప్తించునే కాని మా
నవుఁ డెన్నే విధులం దపించినను జెంతంజేర దొక్కింతయున్.

ఇట్టివీ రుపరిపత్రమందే యుదాహరించిన '1943తోఁ గృతయుగము రాదు, కలియుగము పోదు' అను పెద్దయక్షరములే యేతద్గ్రంథసారాంశము. చేతావని భాషాద్రోహ ధర్మద్రోహ పరిపూరితము. యుగపరిమాణమునుగూర్చి యందుఁ దప్పులెక్క వేయఁబడినది. తొలుతటి గ్రంథములలోని శ్లోకముల తలలు మార్పఁబడినవి. ఇట్లే మఘలోనున్న సప్తర్షులఁ దీసికొనిపోయి కృత్తికలోఁ ద్రోసియు 1943 ఆగష్టు 1 (స్వభాను సం॥ ఆషాఢ బ ౧౫) వట్టి కల్పమైన సూర్యగ్రహణమును శ్రావణ బ ౧౫ను పెట్టి యంధకారబంధురమగు నఖండగ్రహణమని యభూతకల్పనచేసియు నపార్థములు వ్రాసియుఁ జేతావనిగ్రంథకర్త పండితుల మెండుగా దూషించియుండ ఖండించి వానిని శాస్త్రిగారు సత్యవిషయమును జగమునఁ జాటినందులకు సర్వులును సంతోషించుటయే కాక సాష్టాంగనమస్కారములుగూడ సమర్పింపవలసియున్నది. చేతావని చేసినవారు రాజనారాయణజీ షట్శాస్త్రిగారు. హిందీలో నున్న దాని కాంధ్రానువాదకులు 1 వంకాయలపాటి లక్ష్మీనారాయణగారును 2 వడ్డాది వీరరాజుసిద్ధాంతిగారును. మొదటిది గుంటూరుజిల్లా, ఉన్నవ హనుమన్నిలయమువారును రెండవది రాజమండ్రి పగడాల సుందరముగారును ప్రకటించిరి. వడ్డాది వీరరాజుసిద్ధాంతిగారు స్వయముగాఁ గనిపెట్టితిమనికూడ వ్రాసియున్నారు. అంతయుఁ గనిపెట్టినదేనో యనువాదముఁ జేయుచుఁ గొంతయే కనిపెట్టిరో గోచరముకాదు. ఉభయగ్రంథములును సుపత్రమోహసంహారములలో నుద్దిగనే యున్నయవి. 1943 జులైతోఁ గలియుగమును గడముట్టింపఁదలఁచిన రాజనారాయణజీషట్శాస్త్రిగారితో లక్ష్మీనారాయణ వీరరాజుసిద్ధాంతు లేకీభవించి వ్యాపారము వర్ధవంతముఁ జేసికొనిరి.

దివ్యశబ్దార్థము సూర్యుఁడుగాని దేవతలుగారని చేతావనికర్త సిద్ధాంతము. వ్యాకరణమని యందుల కేమిమో వాకొనియెను. దివి భవాః దివ్యాయని కుష్క- సాహిత్యవంతులకే సుబోధమై యది దేవతాశబ్దపర్యాయపదముగాఁ దీసికొనఁబడు చున్నది. పైనఁ బ్రాకృతసంస్కృతశబ్దములనుండి ప్రాచ్యప్రతీచ్యశబ్దము లైనట్లు యత్రత్య యనువచ్చి దివ్ శబ్దమునుండి దివ్యశబ్దముగుటను సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చూపెట్టి చేతావని వ్యాకరణజ్ఞానమును భిన్నభిన్నముం జేసివైచిరి. మఱియు శాస్త్రిగారు మనుష్యమాన దేవమానాదుల విషయమున పట్ఛాస్త్రిగారు వ్రాసిన దంతయు స్వప్ర మాణముగా ఖండించి యదియంతయు నవ్యకల్పిలాపమగుట నందఱకు నగపఱచిరి. నారాయణజీ పట్ఛాస్త్రిగారు పండితుల నందఱిని బడఁద్రిప్పి యుగములనే తలక్రిందుఁ జేసెను. 1948లోనే కలితెంచెఁ గృతయుగమని పామరుల నందఱను భ్రమపెట్టెను. అట్టివ్రాఁతయంతయు శాస్త్రిగారిచే సప్రమాణముగా శతశః ఖండితము. భాగవ తాదులలోని శ్లోకములఁ దీసికొని స్వమతానుకూలార్థమును సాధించుటకుఁ గాఁ దద్వ్యాఖ్యానకారులకు శ్రీధరాదులనుగూడఁ జేతావనికర్త జ్యోతిశ్శాస్త్రాది జ్ఞానము లేనివారని దూషించినవాఁడు. అట్టిపట్టఁగల యతని యజ్ఞానము నగపఱచుచు క్షమా పణ చెప్పఁదగినంత పనిని శాస్త్రిగారు సలిపియుండిరి. ఆ క్షమాపణ యనువాదకులే చెప్పుదురో చేతావనిమూలకారుని చేతనే చెప్పింతురో శీఘ్రముగాఁ దేల్చి చేసిన మోసమును జిన్నగాఁ దొలఁగించుకొందురుగాక. కానిచో స్వభానుసం॥ ఆషాఢామా వాస్య సమీపించుచున్నది. బ్రహ్మాండమైన గ్రహణము పట్టక కలియుగము పోయి కృతయుగము రానియప్పుడు ప్రతిమనుష్యుఁడు జడిసెలు పట్టుకొందురు. కలి యుగాంతమునకు ఘనకారణముగా పట్ఛాస్త్రిగారు వర్తమానజనుల నడవడిని వరుస పెట్టి చూపించిరి. కాని దిగువ వచనములను దేవీభాగవతాదులలోఁ దిలకింపకపోయిరి. చూడుఁడు.

శ్లో. సర్వే స్త్రీవశగాః పుంసః, పుంశ్చల్యశ్చ గృహేగృహే,
తర్జనై ర్భర్జనైశ్చైవ స్వామినం తాడయంతిచ,
విద్యాసంబంధిభిస్సార్థం సంభాషాపి నవిద్యతే.
సర్వకర్మాక్షమాః పుంసో యోషితా మాజ్ఞయా వినా.
సత్యహీనా జనాస్సర్వే, సస్యహీనాచ మేదినీ,
ఫలహీనాశ్చ తరవోఽ పత్యహీనాశ్చ యోషితః,
క్షీరహీనా స్తథా గావః క్షీరం సర్పిర్వివర్జితం. దే. 9 స్కం. 8అ.

ఇత్యాదివచనములఁ జూపెట్టి యిట్టినడవడి యింకను గలిలోఁ గ్వాచిత్కముగాని సార్వత్రికము గాకుండుట శాస్త్రిగారు స్పష్టపఱచిరి. ఒక్క శాస్త్రిగారే యన నేల?

కం. పొందుదురు మ్లేచ్ఛభావము బృందారకవర్య! ఎల్లద్విజులును
నిందితకర్మోత్సవతను సందేహములేక వర్ణసంకరకరులై. [(బ్రజలుఁ
(స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము)

ఇత్యాదివాక్యము లెన్నియో యున్నయవి. ఇందుఁ జెప్పఁబడినట్లుగా నే కొందఱో యిప్పటికి మ్లేచ్ఛభావము పొందుచున్నను నందఱును నట్లగుట యగుపట్టదు. అందఱును నట్లగువాఁటికిఁ గలియుగాంతము కావచ్చును. అట్టి స్థితికి వ్యవధి యత్యంతము నున్నది. చేతావన్యనువాదకులలో నొకరై స్వయముగాఁ గనిపెట్టికూడ నున్న వీరరాజుసిద్ధాంతిగారు వీరభోగవసంతరాయలని వేఱుగా నొకపేరు రక్తాక్షి నుద్భవించియున్న కల్కిమూర్తికి వ్యక్తపఱచిరి కాని రాయలనునది తెలుఁగుపదమగుటఁ బ్రాచీనసంస్కృతగ్రంథములలో నిట్టిపే రుండదని శాస్త్రిగారు స్పష్టపఱచిరి. వడ్డాదిసిద్ధాంతిగారు తమరు వీరరాజులగుటఁ దత్కల్కిమూర్తినిగూడ వీరభోగవసంతరాయలనుగా మాఱిచిరి కాఁబోలు. ఎంతయని వ్రాయుదును? ఇట్టి చేతావని చెట్టతనము నంతయు మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మంచిగా ఖండించిరి. మఱి కొందఱుపండితులును ఖండించియున్నవారు. కాని ఖండనములు కనుగొనకముందు కళవళపడినవారు కల రనేకులు. పామరులే కాదు భాగవతాదిప్రమాణసిద్ధమని పామరులు పలుకుపలుకులే పాటిగాఁగొని బాగుగాఁ గనువిప్పి చూడక పండితులు కూడఁ గొందఱు భ్రమపడిరి. అందఱిభ్రమలను నంతరింపఁజేయు నీఖండన మెంతయు లోకోపకారకము. అపగతభ్రములు గాని యల్పసంఖ్యాకు లందందు నుందురుగాక. పందొమ్మిదివందలనలువదిమూఁడుతో నందఱిభ్రమలును దీఱఁగలవు. ఈగ్రంథము వెల యొనిమిదణాలే. గ్రంథకర్తపేర నంద్యాలకుఁ గాని వావిళ్లవారికిఁ గాని వ్రాసి కొనవలయును. అన్నిబుక్కుషాపులలోను నిది దొరకెడిని.



## — ♦ రాజసూయము ♦ —

### శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారు

పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగా రీరాజసూయమునుగుఱించి విపరీతముగా వ్రాసియున్నారు. రాజుల నందఱను జయించుట పూర్తియైనపిమ్మటఁ జేయఁబడు యాగమునకు రాజసూయమని పేరు...జయించినపిమ్మట... వారినందఱ నాహ్వానించి సభచేసి యం దందఱచేతను దన సార్వభౌమత్వము నంగీకరింపఁజేసి... సత్కరించిపంపుట విధి... శాంతముగాఁ బ్రజారంజకముగా దేశము పాలింపవలసిన సార్వభౌమున కిది యవశ్యకర్తవ్యము... ధర్మజుఁడు వైదికకర్మానుకూలమైన రాజసూయము పురస్కరించుకొని... రాజుల నందఱ సమావేశపఱచి...సార్వభౌమత్వము స్థిరపఱచుకొని వారివలనఁ గరగ్రహణమొనరించి... సత్కరించి వారివారి దేశముల కనిపెను...

ధర్మజుఁడు యజ్ఞమునం దెవరికిఁ దగిన కృత్యముల వారికి నియమించుచు ... జితులైన రాజు లందఱు సమర్పించిన మణి భూషణ కాంచన చీనిచీనాంబరాద్యుపహారము లందుకొనుటకు దుర్యోధను నియోగించెను. ... దుర్యోధనుఁడు శకునితో ... 'రాజలోక మంతయుఁ బాండవప్రతాపముచే దహింపఁబడినది' అనిచెప్పి వాపోయెను ... ధృతరాష్ట్రునితో "పాండవులు యావత్ప్రపంచమును జయించిరి, అం దర్జునుఁడు

రెక్కలుగలవాఁడు వినా గానరుగుటకు వీలులేని యుత్తరకురుభూముల జయించెను" అనిచెప్పెను... ఈహేతువులం బట్టి దిగ్విజయానంతరము రాజసూయము జరిగెనని స్పష్టముగాఁ దెలియుచున్నది...

దిగ్విజయ మబద్ధమనియు రాజసూయానంతరము దిగ్విజయము చేయుట విధి యనియు...శాస్త్రిగారు వ్రాయుచున్నారు... రాజన్యు లందఱు నెట్లు కానుకలిచ్చిరి? ...యావద్దిగ్విజయమునకు జరాసంధవధ మూలాధారమైయున్నది. రాజసూయానంతరము ధర్మజుఁ డిరువదిమూడువత్సరములు ప్రపంచసామ్రాజ్యము నింద్రప్రస్థము రాజధానిగా నేలెనని గ్రంథమునం దున్నది. పాండవు లరణ్యవాసము చేయుచున్నపుడు ధర్మజుఁడు భీమునితో "దిగ్విజయములో మనచే జయింపఁబడినవా రిపుడు మనచే... ద్వేషముఁగలిగియున్న రాజులు దుర్యోధనుపక్షముఁ జేయుదురు" అనిచెప్పియున్నాఁడు ... ఇఁక దిగ్విజయ మబద్ధమని యెట్లనఁగలము?...కావున... ముందు దిగ్విజయ మైనదనియు నందు రాజులందఱు జయింపఁబడిరనియుఁ బిమ్మట రాజసూయ మైనదనియు... ధ్రువపడుచున్నది.

...బ్రహ్మర్షులతో రాజులతో నిండియున్న మహాసభలో ముందుగా నెవరిని బూజింపవలయునో యెఱుఁగక ధర్మజుఁడు... ధర్మములు సాకల్యముగా నెఱింగిన భీష్ము నడిగినపుడు... మహర్షులకంటె మహర్షియు ధర్మార్థవిదులకంటె ధర్మార్థవిదుఁడు బలవంతులకంటె బలవంతుఁడు నగు కృష్ణుం బూజింపుమనెను... కృష్ణుం బూజించిన ...శిశుపాలుఁ డందుకాక్షేపించెను...నిందించుచు...పోవుచుండ... ధర్మజుఁడు వలదని ... శిశుపాలుం బ్రార్థించెను... సభనుండి లేచి శిశుపాలుఁ డావల నడుగుపెట్టుట తోడనే యతని సేనాపతి...స్వపక్షీయులైన రాజులఁ గూర్చుకొని...యుద్ధసన్నద్ధుఁడై నిలిచెను. ఇఁక...యజ్ఞకర్మ సాగదు...అచ్చట యుద్ధము కాఁగూడదు...ప్రశాంతముగా యజ్ఞసమాప్తి గావలయును. శిశుపాలుం డడతెచ్చిన చిక్కు లన్నియు విడిపోవును. కృష్ణుఁడిందుఁ బ్రశాంతముగా గంభీరముగా సహేతుకముగా ...దుండగము లన్నియు సభాసదులకు వివరించి... చక్రముచే నొక్కపెట్టున వాని శిరశ్ఛేదము గావించెను... చుట్టుపక్కల నిలిచియున్న మిత్రులు సేనాధిపతులు... దిగ్భ్రమఁజెంది చూచుచు బొమ్మలవలె నుండిరి. ధర్మజుఁడు... చింతించి వాని కుమారు నాశ్వాసించి చేదిరాజ్యమునకు నభిషిక్తుం గావించి శిశుపాలునకు దహనసంస్కారము గావింప సోదరుల నాజ్ఞాపించెను...

...శాస్త్రిగారు శిశుపాలుశవమునకు దహనసంస్కారము చేయుటకై...కుమారున కొప్పగింపక తనసోదరుల నాజ్ఞాపించెననుటలో హోమవిధికై యుండవచ్చునని సూచించుచున్నారు. ప్రాజ్ఞులారా! ఇంతటి రహస్యమును... భారతము నెంతజాగ్రత్తగా విమర్శించి గ్రహించిరో చూడుఁడు....సోదరుల నాజ్ఞాపించెననుటలో దహనాది కర్మ నిర్వహణమునకుఁ గావలసిన యావత్పరికరములు సమకూర్చి కుమారుచే సమస్తకర్మలు చేయించుటకొఱకుఁగాని యతని శరీరమును యజ్ఞకుండములో హోమము చేయించుటకుఁ గాదు. శిశుపాలతనయుఁడు బాలుఁడగుటచేతను దాను దీక్షితుఁడగుట స్వయముగా

సంస్కారముచేయింప నవకాశము లేమిని...తనసోదరుల నాజ్ఞాపించియున్నాఁడు...

శిశుపాలదంతవక్త్రులు దుర్మార్గులైనట్లు భారతభాగవతాది గ్రంథము లన్నియుఁ జెప్పుచున్నవి... శిశుపాలుఁడు కృష్ణద్వేష...మే కా...దు. లోకమున కపకార శతములు చేసియున్నాఁడు...చేసెనని కృష్ణుఁడే చెప్పియున్నాఁడు.... ధర్మరక్షణార్థ మవతరించిన కృష్ణుఁడెన్నడో వాని వధించియుండవలసినవాఁడే కాని మేనత్తకొడు కనుతలంపుతో...సైరించి యూరకుండెను. రాజసూయములో నూరకుండుట కవకాశము లేదు. అపు డుపేక్షించినఁ గలహ మంతరింపదు. యజ్ఞధ్వంస మగును. కావున... వధించెను... దంతవక్త్రుఁడుగూడ శ్రీకృష్ణున కొక మేనత్తకుమారుఁడు...ఇరువురు నేకీభవించియే కృష్ణుని ద్వేషించి...రి...వీరిని పౌరాణికులు హిరణ్యాక్షహిరణ్యకశిపులతో రావణకుంభకర్ణులతోఁ బోల్చిరి...

---

## వద్దూరు కట్ల ప్రశస్తి.

—o—

తణుకుతాలూకా వద్దూరు శల్యచికిత్సకు మూలస్థానమని చిరకాలమునుండి ప్రతీతి గలిగియుండుట యాంధ్రలోక మెఱింగినవిషయమే. దానినిగూర్చి నేఁడు క్రొత్తఁగా జెప్పఁదగినవిషయము లేకున్నను నాకుట్టిని చికిత్సాసందర్భమున స్వయ మనుభూతములగు కొన్ని విశేషములను జెప్ప సాహసించితి.

చిరకాలమునుండియుఁ బ్రసిద్ధికెక్కిన పెన్మత్ససద్వంశజులగు బంగారురాజుగారు ప్రస్తుత మేతచ్చికిత్సాశ్రమప్రధానకార్యనిర్వాహకులు. వీరు వయఃప్రజ్ఞావృద్ధులు- విశేషానుభవముగలవారు- వీరి యల్లుఁడు కఠారి వేంకటరామరాజుగారు వీరికిఁ గుడిభుజమువలె సహాయపడుచున్న యువకులు. సూర్యోదయము మొదలు సూర్యాస్తమయము వఱకు స్వతనూసౌఖ్యము విడనాడి శాంతమూర్తులై విసుగుఁజెందక, యెడతెగకవచ్చు రోగుల వికలాంగములను సరిఁజేయుచు నొక్కనాఁడైనను దాతలనాఁటి ధర్మసూత్రములను విడనాడక యీడెబ్బదియేండ్ల ప్రాయమునఁగూడఁ దదేకదీక్షగఁ జికిత్సచేయు బంగారురాజుగారి కృషి వర్ణనాతీతము- ఎత్తున కెత్తు బంగారము కరఁగించిపోసినను వీరి ఋణము లోకము తీర్పఁజాలదు. కాలము మాఱినను బుద్ధులు మాఱినను వేషభాషలు మాఱినను నభిరుచులు మాఱినను నిజవంశప్రతిష్ఠ పోకుండఁ బ్రోఁకులాడు నీధీరోదార గుణరత్నాకరుని, పీసమైన ధనాపేక్ష లేక తనువొగ్గి శిరమొగ్గి కర్మతత్త్వ మెఱింగి, తోడిమానవులలో ఏకలాంగుల సుకలితాంగులఁ జేయు నీ శ్రీ బంగారురాజమహాశయుని నితోధిక సంఘసేవాభివృద్ధికై సంపూర్ణాయురారోగ్యశ్రీలతో నకుంఠదేహపటుత్వము నిచ్చి భగవానుఁడు సంరక్షించుఁగాత !

విధిబలము చాలమి నంగవైకల్యముఁగాంచుచో వారలు ధనికులైనను గాకున్నను దబ్బిబ్బుఁజెందుటయే కాక పాశ్చాత్యకళావ్యాకృష్టులై యాసుపత్రుల కేగి వేలు వెచ్చింపక మన భారతదేశమునఁ బ్రాచీనాయుర్వేదకళాసార మింకను నింకలే దనియు, మనవారిధీబల మన్నింట నపారమనియుం గుర్తించి ధన్యు లగుదురుగాక! అను

పద్ధతులలో సాధ్యముకాని శల్యచికిత్స బంగారురాజుగా రొక్క గోఘృతముచే సాధించుచున్నారు. అది గోఘృతమహిమ యనుటకంటె వారి యమృతహస్తవిశేషమే యని నాపరమవిశ్వాసము.

మన గోమాత భూలోకదైవమని మనవారు మఱవకుందురుగాక. గోఘృత మమృత మనియు దాని విలువ వర్ణనాతీతమనియు గ్రహింతురుగాక. భారతదేశము సర్వకళాసమృద్ధమై యెందును లోపము లేక తనరారుఁగాక!

వందలకొలఁది కుటుంబములు వడ్లూరు వచ్చుచుండఁ దగినసత్రములు వసతులుం జాలకున్నవి. బంగారురాజుగారు చేయుకృషి లోకోపకారకమనియుఁ దదభివృద్ధిలోకాభివృద్ధిదమనియుం నెఱిఁగి యచ్చట సత్రములు వసతులు శాశ్వతముగా సాగునట్లుదారధనికలోక మెక్కుడుగ సాయపడుఁగాక!

## —: పంచరత్నోపహారము :—

క. రాజై లోకాదృతికిం దేజోమార్తాండవంశదీపకుఁడై వి
భ్రాజితగుణుఁడై బంగారాజీ వడ్లూరుపురవరంబున నొప్పున్. 1

ఉ. ఆతఁ డుపేక్ష లేక వికలాంగులపట్ల నొనర్చుసేవ దు
ర్వ్యాతము గ్రమ్ముటన్ విఱుఁగఁబడ్డ జనాళి కొనర్చుసేవ దాఁ
జేతికొలంది గోఘృతముఁ జేర్చుచు నద్దుచుఁ గట్టుసేవ వి
స్మితమనంబుతోఁ దలఁచి చెప్పనివాఁడు కృతఘ్నుఁడౌఁగదా! 2

మ. తనదేహంబు పరోపకారమునకున్ దా నంచు నర్పించి యే
పనియున్నన్ వెనుదీయఁబోక విమలస్వాంతుండు శాంతుండునై
ఘనదృష్టిన్ వికలాంగులన్ గనుచు బల్ కష్టించు పెన్మత్సస
ద్ఘనవంశాగ్రణి రాజచంద్రముఁడు బంగారాజు సంశ్లాఘ్యుఁడౌ

ఉ. చేతము పల్లవించునటు చేయుచు శల్యచికిత్స నిచ్చలున్
దాతలనాఁటి ధర్మములు దప్పక జీవితమున్ గమించు నీ
నీతిపథానువర్తనుని నిర్మలచిత్తునిఁ బ్రోచుఁగాత మా
భూతనయామనోహరుఁడు పూజ్యుని బంగరురాజచంద్రునిన్. 4

ఉ. ఈక్షితి నీమహర్షి జనియించినదాదిగ నేఁటిదాఁకఁ బ్ర
త్యక్షపుదైవమా యనెడు ఖ్యాతికిఁ దావలమయ్యెఁ గాన రా
జా! క్షితి దేవ! యంచు విమలాక్షరపంక్తులఁ గీర్తిసేయ నా
యక్షరకోటిఁ జేర్చితిఁ గృతార్థుఁడ నైతి ధరాతలంబునన్. 5

వాజపేయయాజుల రామసుబ్బరాయఁడు,
స్నేహలతాకవితాసంఘము - శ్రీ జటప్రోలుసంస్థానము.

## — ♦ శ్రీకృష్ణదేవరాయలు ♦ —

( ద్విభాష్యము వెంకటరావుగారు )

మ. రిపుసమ్మార్జనమో కళాభరణమో శ్రీయస్కరాంధ్రీకృతా
స్వపరీపాలనమో భుజావిభవమో సౌరభ్యలభ్యాంధ్రికా
వ్యపటుత్వప్రసరంబొ మౌక్తికతులాభారంబొ శ్రీకృష్ణరా
ణ్నృపతీ! యీగుణరాసు లెందుఁగలవే నీకీర్తికిన్ బాత్రముల్ ? 1
మ. చలనంబందని స్వాత్మగౌరవము స్వచ్ఛాంధ్రాభిమానంబు మీ
వలె దిగ్దంతుల కర్ణముల్ పగులఁగా వాయించె నేరా? జిదే
తెలుఁగుందేశము తెల్గునాయకుఁడనైతిన్ దేశభాషావలిన్
దెలుఁగే లెస్సని ఢంకఁగొట్టితివి కాదే! కృష్ణరాయాధిపా! 2
సీ. కొండవీటిరెడ్డికులనాయకుల ననే
కులను గత్తులబావిఁ గూల్చునాఁడు
బొబ్బిలిలో రావుబెబ్బులుల్ గర్జింప
నడలి బుస్సీ యంగలార్చునాఁడు
అనపోతరెడ్డి నూటాఱునెత్తురు లెత్తి
పితృతర్పణముల నర్పించునాఁడు
ఖడ్గతిక్కన మెడకాయ గుత్తము నోటఁ
బట్టి ముంగిటఁ దెచ్చిపెట్టునాఁడు
తావక కృపాణతీక్ష్ణధారావిభీతి
నశ్వపతికి గుత్తపువాత మలమునాఁడు
తెలుఁగుతలికద్పుపంటలన్ వెలుఁగువెలుఁగు
లింక నెపుడు కాంచెదమొ శ్రీకృష్ణరాయ! 3
మ. గనిలో నిగ్గ పదాఱువన్నియల కాఁకల్ తీరు బంగారుతో
ననువౌపాళము తీఁపివెన్నెలరసం బాడించి మీకిచ్చిరో
పునుఁగుందావి నవోదనంబు మిరియంపుంబొళ్ళ కెట్టుబ్బ మీ
యనవద్యాంధ్రసుహృద్యపద్యరచనావ్యాపారపారీణతల్ ? 4
శా. ఆహా! నాఁ డలరాయచూరువిజయప్రారంభసంపాదితో
త్సాహంబంది "యడిల్ల షామకపదాబ్జాతంబుఁ జేఁబట్టి దా
సోహమ్మన్న క్షమింతు" నంట విని వాఁడా నీభుజాపంజర
వ్యూహాంబీధర నుండినంతవఱకున్ బోకుంటె వేల్పించెనే? 5

సీ. భవదీయ పాండితీచ్ఛవి సత్కవీంద్ర స్వ
తంత్రదీప్తికి మూలమంత్రమయ్యె!
భవదీయ శౌర్యవైభవ మశ్వపతి గజ
పతులకు డొక్కలో బల్లెమయ్యె!
భవదీయ చండభానువిభూతి దాడిమై
మొండిబండల గుదిగండయయ్యె
భవదీయ విషమాస్త్ర జవధాటి భామినీ
జాలంబునకు గుండెగాలమయ్యె
భవ్య భవదీయ నవరత్నభాసమాన
భువనవిజయ సభాస్థలీపూర్వభాను
రూప శ్రీకృష్ణదేవరాడ్భూప! నీదు
పేరు, మనయాంధ్ర రతనాలపేరు కాదె? 6

మ. హితమై కీర్తినిధానమై విమలసాహిత్యామృతాస్వాద శా
శ్వతమై కన్నులపండువై పరఁగు విభ్రాజత్కళోపాసనా
యతసౌభాగ్యము చెట్టఁబట్టి సరితోడై మీకళాపోషణా
ద్భుతకీర్తిద్యుతి నిట్టి పెండ్లిమహా మెందుఁ గంటిమే భూవరా? 7

ఉ. కోవెల పెంటి కుత్తుకల కూఁతలకూర్పులలోని నేర్పులన్
చేవలుతీరి మెండుకొను చెందొవలన్ దులఁదూగు తావులన్
నేపళమైన కొంబసిఁడినిగ్గులుగుల్కు పదాలువన్నెలన్
గైవసముంబొనర్చుకొని కైతల నల్లితి వెంతవాఁడవో! 8

కం. ప్రకటాంధ్రనైజగుణవర్ధకపద్ధతు లూఁతగొని ప్రతాపించిన నీ
సుకవిత్వరసకళాధాటికిఁ జాలక మేము మర్కటించితి మకటా! 9

---

## శ్రీ సనాతనధార్మికయువజనసంఘము.

### (సింహావలోకనము)

ధార్మికమహోదయులారా! ఒకపరి కనులఁదెఱచి పరికింపుఁడు. మన పురాతన మహోన్నతస్థితిని నేఁటి మన దుఃస్థితిని నొకపరి బాగుగ విమర్శించుకొనుఁడు. నేఁటి మనపరిస్థితి పర్వతాగ్రమునుండి క్రిందఁ బడినవాని స్థితివలె లేదా? ఆధ్యాత్మిక భౌతిక వైజ్ఞానికార్థిక విషయములలో ... మన మహో...న్నతస్థితి నొందియుంటిమి. భగవదాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులచే విధింపఁబడిన వర్ణాశ్రమధర్మముల నత్యాదర

ముతో ననుసరించుచుఁబరస్పర సౌహార్దముతో మెలంగుచు...ంటిమి. నేఁడో ! అత్యంత విపరీతస్థితి నొందితిమి. ఆధ్యాత్మికముగ వైజ్ఞానికముగ నార్థికముగ నెట్లుచూచినను మన మతినీచస్థితిలో నుంటిమి. భగవానుఁడు మనల నుద్ధరింపవలెనను నాశయముతో శ్రుతిస్మృతుల ద్వారముగ మనకు విధించిన వర్ణాశ్రమధర్మములఁ బరిత్యజించుచుంటిమి. పరస్పర వర్ణవిద్వేషములతోఁ గ్రౌర్యభావముల వెళ్ళఁగ్రక్కుచుఁ బ్రపంచశాంతికి భంగము గలిగించుచున్నాము. భగవదాజ్ఞల నతిక్రమించుటయే మన యీప్రపంచశాంతిరాహిత్య మునకు ముఖ్యహేతువు. పెద్దల మాటల వినని పిల్లనిజీవిత మెట్లు పరిణమించును ! దుఃఖాంతముగనే... అట్టి...భగవానుని యాజ్ఞల నతిక్రమించినపుడు మనమిట్టి దుఃస్థితిని జెందుటలో నాశ్చర్య మేమియో యోజింపుఁడు. ... మన మిప్పటికైన మేల్కొని ధర్మరక్షణకై పాటుపడుట ముఖ్యకర్తవ్యము. ... నాగరకతా వ్యామోహ మోహితులగు కొందఱు.. మనసంఘము నే... చెడఁగొట్టుటకుఁ బలుభంగుల యత్నించుచున్నారు. ...శాసననిర్మాణాదుల ద్వారమున మనలనందఱ హింసించుటకుఁ బూనుకొనుచున్నారు. ...శాసనములవలన...పవిత్రతమమగు హిందూమతమునకు ... నపకారముగలుగుచున్నదను విషయము నిస్సంశయము. మనమిదివఱలో నిట్టిశాసనములు ... ప్రవేశపెట్టఁబడుచున్నపుడు ... 'మామతధర్మముల నీశాసనము భంగపఱచుచున్నది, ఇట్టి శాసనములఁ బ్రయోగించి మమ్ము...బాధింపకుఁడు' అని యనేకవిధముల మొఱపెట్టుకొనియుంటిమి. ...కాని యధికారమదోన్మత్తులగు వారలకు మనమొఱలు చెవికెక్కలేదు. మన మతములు వారిదృష్టిలో.. పిశాచములవలెఁ గన్పించుచుండుటచే...మనమొనర్చు నాక్షేపములు వారల దృష్టిలో గుణముగనే గనుపించినవి. కాని మతధర్మముల నతిక్రమించుట మానవున కిహపరదుఃఖప్రదమను విషయము వారి మనస్సునకుఁ దట్టనే లేదు. మనము తలపెట్టిన కార్యమునకు...సనాతను లెదుర్కొనువారా ? వీరిమాటల మనము చెవిఁ బెట్టుటయా? అను నావేశముతో వారలు గబగబ ననాలోచితముగఁ గొన్ని శాసనములఁ బ్యాసుచేసిరి. ... శారద శాసనము కడుపారఁ గన్నబిడ్డలకుసైతము తలిదండ్రులు తమ మతగ్రంథముల ననుసరించి సకాలమున...పెండ్లిఁజేయు నధికారము నూడ్చపెట్టినది. ...మఱొకశాసనము సవర్ణులు.. మోక్షసామ్రాజ్యము నధిగమించుట కాగమోక్తవిధానములతోఁ గట్టుకొనిన గుళ్ళలో యథాశాస్త్రముగఁ బ్రార్థనల జరపుకొనుయోగ్యత నశింపఁజేసినది. పవిత్రతములగు నీయాలయములలోఁ బంచములు...బలాత్కారముగ నీశాసనబలమునఁ బ్రవేశపెట్టఁబడుచున్నారు. ... ఇట్టిదుస్థితి మనకుఁగల్గుటలో ముఖ్య హేతుభూతు లెవరు ? మతాంతరులు కారు. మనవారే, మనమతములోనివారే, మన కుటుంబములలోనివారే, మనచే నెన్నుకొనఁబడినవారే. మోసము. మోసము. ఈమోసము నుండి మనము బయటఁబడ యత్నింపవలదా ! ధర్మోద్ధరణకై పాటుపడవలదా ?

ఇందులకు ముఖ్యముగ మన ధార్మికసంఘము నభివృద్ధినొందింపఁజేసికొనుట యవసరము. మనము బలపడిన రోజు వీరలు మనకు నేటివలెఁ దీవ్రమగు నపకారమును గలిగింపఁజాలరు... మనము...అందోళనాశూన్యులమై యుండునంతకాలము వీరియపకారములకు గుఱికావలసివచ్చుట తప్పదు. మనము సంఘమును బలపఱచుకొనినపుడే కష్ట

ములఁ గడచుటయే గాక ధర్మము నభివృద్ధిలోనికిఁదీసికొని రాఁగలము. ...ప్రతిపట్టణము లోను బ్రతిపల్లెలోను సనాతన సంఘములు స్థాపింపఁబడవలెను. పండితులద్వారమునఁ బ్రజలలో సత్యద్భుతమగు ప్రచారము జరిపింపవలెను. ప్రజలలో మన మతముయొక్క సత్యస్వరూపము ప్రతిఫలింపఁజేసినఁగాని మనము సరిగ నుద్దిష్టఫలము నందఁజాలము. ...మనసంఘమొకవిధమగు బలమునొందినఁగాని రాజకీయముగ మన వ్యక్తిత్వము గమనింపఁబడదు. అనాఁడుకాని మన మీశాసనపిశాచముల బారినుండి తప్పించుకొనుటకైన నవకాశము లభించదు. చూడుఁడు! నిజాంరాష్ట్రమున షుమారు రెండేండ్లనుండి యొకవిధముగ మనధార్మికులలో సంచలనము గలిగినది. ఇందులకు హేతు వప్పట్ల నిజాంశాసన సభలో బాల్యవివాహనిరోధకశాసనము ప్రవేశపెట్టఁబడుటయే. అప్పుడు ... సనాతనులు సనాతనధర్మమహాసభ యను పేర నొకసంఘమును స్థాపించుకొనిరి. శారీరక మానసికార్థిక క్లేశముల లక్ష్యపెట్టక యమోఘమగు ప్రచారమును గావించిరి. ఊరూర ... శాఖాసభలు స్థాపింపఁబడినవి. పండితప్రకాండులు ప్రజలహృదయకుహరములలో ధర్మోపన్యాస సింహనాదములఁ బ్రతిధ్వనింపఁజేసిరి. ఆయాందోళనకు ఫలితముగ రాజకీయాధికారుల హృదయములలో సనాతనసంఘము చిత్రింపఁబడెను. ధార్మికుల మొఱకుఁ జెవియొగ్గఁబడెను. ...కౌన్సిలు సభ్యులు ... మతాంతరులైయున్నను మన మతమును రక్షింపవలెనను నభిప్రాయముతో ... బిల్లు ప్రతిఘటించి యోడించి ... ధార్మికుల యభినందనములకుఁ బాత్రులైరి. తరువాతఁగూడ శాసనసభలోఁ బ్రవేశపెట్టఁబడిన (1) స్త్రీస్వాతంత్ర్యపుబిల్లు (2) హిందూవారసత్వపుబిల్లు (3) వికలాంగుల వారసత్వపు ...బిల్లు బహుళసంఖ్యాక సనాతనప్రజల కోర్కెననుసరించి త్రోసివేయఁబడినవి. ఇట్లే ...మనము ... తగు యత్నము చేసినచో మన కోర్కెలు ఫలించఁగలవు.

కాన ధర్మాభిమానులందఱు సోత్సాహులై ధర్మరక్షకై పాటుపడుదురుగాక, స్వమతధర్మముల రక్షించుకొని తన్మూలముగ నిహపరసుఖములనేగాక మోక్షసామ్రాజ్యమునుగూడ నంద యత్నింతురుగాక! మన కిపుడు ముఖ్యముగ నీ వచనములు స్మరణీయములు. "న జాతు కామా న్న భయా న్న లోభా ద్ధర్మం జహ్యా జ్జీవితస్యాపి హేతోః" "ధర్మా దర్థశ్చ కామశ్చ." ఇతి శివమ్

—కల్వపల్లి.

---

## భరతఖండ ప్రకృతపరిస్థితి

(సంపత్కుమారాచార్యులు, జటప్రోలు సంస్థానకవి)

శా. ఆర్యాచారము కొంత, ధర్మ్యయుతమౌ వ్యాపార మొక్కింత, స
త్కార్యారంభము కొంత, నాగరికతా కాంతిచ్ఛటల్ కొంత, యా
వాక్యప్రక్రియ కొంత, ఖేలనకలాధారంబు లొక్కింత యీ
యార్యావర్తముసేరఁ జూచుటకు నాయాంతర్య ముప్పొంగెడిన్.

ఉ. భారతదేశమెల్లఁ బరివర్తన మందె, ప్రపంచ మంతటన్
ధీరులు వెల్లడింపఁదగు దివ్యమహాత్త్వము నారిదో సదా
చారము మృగ్యమయ్యె, వరుసం గులధర్మము నాశమందె నే
తీరునఁ జూచినన్ సుగుణతేజముఁ గప్పెడిఁ గాఱుచీఁకటుల్.

సీ. పసఁపుఁ గుంకుమ మోముపస డించునంట, ఈ
"ఫేసుపౌడరె" ఒక "ఫేష" నంట
నవ్యసౌరభలతాంతము లసహ్యములంట;
కాగితంబులపూలె కాంతియంట,
శ్రీచూర్ణధారణ సిగ్గులచేటంట,
చుక్కబొట్టులె కడుసొబఁగటంట,
అవయవంబులు గప్ప నంబరాల్ మోటంట,
సామేనుఁ గప్పుటే చాలు నంట,
పూర్వమతసంప్రదాయంబు పొసఁగదంట,
పెద్ద లేమేనిఁ బల్కిన వెఱ్ఱియంట,
నవ్యనాగరికత్వంపు నైపుణీ వి
శిష్టురాలైనయట్టి సుశీల కిపుడు.

సీ. అరుణోదయస్నాన మాచరించుట తప్పు,
సంధ్యాదికృత్యముల్ చాలఁదప్పు,
ఆమ్నాయధర్మము లవధరించుట తప్పు,
శ్రీభాష్య మెఱుఁగుట చెడ్డతప్పు,
పూర్వాభిమతకర్మ నిర్వహించుట తప్పు,
దైవతారాధన దండితప్పు,
తీర్థసంసేవనాదిక చర్యలును దప్పు,
గురుకులాశ్రమమన్న గొప్పతప్పు,
వేద మదియేడ? శ్రుతిహితవిధు లవేడ?
జాతిమతభేద మేడ? నాచార మేడ?
దైవ మెక్కడ? ఎక్కువతక్కు వేడ?
అనుచు వాదించువారి నేమనఁగ నగును?

సీ. పిండముల్ పెట్టినఁ బితరుల కేటు లబ్బు
నను చు వాదించెడి యనఘమతులు
రాతిబొమ్మకు మ్రొక్క లాభం బదేమని
పరిషత్తులనె పల్కు ప్రాజ్ఞవరులు
అంటినంతనె మైల యంటుట లెట్టు లౌ
నంచు మిక్కిలిగఁ జర్చించుబుధులు
దేవులాడఁగ నెందు దేవుఁడే లేఁడని
సాధించు నాస్తికసార్వభౌము
లిప్పుడేకా దనాదినే యేరుపడిరి.
పరమపావనదివ్య శ్రీభాష్యకారు
లాదిగాఁగలవారిచే నార్జిత మగు
సుప్రతిష్ఠకుఁ గలిగె నీయప్రతిష్ఠ.

క. తనజన్మము తనజాతియు, తనవంశము తనదు తాతతండ్రుల చరితల్
తనమాతృభూమిగణ్యత, మనమందున నెంచనట్టి నునికిడి తగునే?

చ. అరుదగుజన్మ, మానవత, అందునఁ బూరుషుఁడౌచుఁ బుట్టుటల్,
మతియును నందు బ్రాహ్మణత, మాన్యత, దాన ననన్యభక్తిచే
వఱలఁగనైనయట్టి యల వైష్ణవధర్మము దుర్లభంబు, త
ద్వరమతసంప్రదాయములఁ దత్పరతన్ జననమ్ము ధన్యమౌ.

ఉ. తన్ను నెఱింగి తాను జనుదారి నెఱింగి మతమ్మెఱింగి వం
శోన్నతి బాగుగా నెఱిఁగి యుత్తమధర్మపథమ్మెఱింగి వి
ద్వన్నుతవాక్పరంపరలపారము ముట్టు టెఱింగి యుర్విప
రోన్నతిఁ గోరి స్వీయమత మూర్జితనిష్ఠఁ జరించు టొప్పగున్.

చ. అనుచు సనాతనప్రముఖు లార్యులు పెక్కురు పల్కుచుండ్రు త
ద్ఘనులకు సాఁగి మ్రొక్కవలెఁ గాని తదీయములైన వాక్యముల్
మనమునఁ జర్చఁజేసి యుగమార్గముఁ బట్టి చరించి స్వీయజా
తిని విడనాడకుండుటయె దివ్యతరమ్మగు ధర్మ మిమ్మహిన్.

ఉ. ఈ నవనాగరోచ్ఛలదహీనపరిస్థితి దేశకాలపా
త్రానుసృతిన్ జరించుటకు నాదట దారిని జూపుచుండు, న
ద్దానను మంచియో చెడుగొ తా మది నారసి సర్వలోకస
మ్మానము గల్గునట్టులుగ న్యాయపథమ్మున నేఁగు టొప్పగున్.

క. ఒకతఱి సదృశుల మైత్రిమి,
ఒకతఱి నసదృశుల మైత్రి, యొకతఱిఁ బొందిం
త్యకలితుల మైత్రి, వొకతఱి
సకలవిలక్షణత వెలుఁగఁజాలితిమి సుమీ. 86

వ. ఇంకను నీవ్యాసమునీంద్రుండు 87

చ. ఎనిమిదిసారు లుర్వి జనియించును, భారతసంహితన్ రచిం
చును, విభజించు వేదముల, శుద్ధయశంబును బౌరవాన్వయం
బునకు ఘటించుఁ, బద్మభవభూమపదంబు గనున్, విదేహము
క్తినిఁ గొను, వీతశోకభయకిల్బిషుఁడున్ గతకల్పనుండు నై. 88

వ. ఇట్లు భూతంబులు ధనబంధుకర్మవయోవిద్యావిజ్ఞానచేష్టితంబుల నొక్కవేళ సమము లగుచు వేఱొక్కతఱి భిన్నంబు లగుచుఁ బలుమాఱు కొలువంబడుధాన్యరాశిచందంబునఁ గ్రిందుమీఁదగుచుండు నదియంతయుఁ ననంత యగుమాయాకార్యంబు. ఇట్టి మాయాస్వరూపం బెఱుంగుజీవన్ముక్తుండు నిజయోగబలంబునం జేసి యాధికారికంబు లగునానాశరీరంబులు కలిగియున్నను ముక్తి పదచ్యుతుండు గాక సమాహితచిత్తుండును శాంతవికల్పుండును బరమశమామృతపానతృప్తుండును నిరావరణుండును నై యుండు నని వచించి వసిష్ఠభగవానుండు వెండియు నిట్లనియె. 89

క. అంబుధిలో నిశ్చలతో
యంబైనఁ దరంగమైన నంబువె యగుచం
దంబున మోక్షంబు సదే
హం బైన విదేహ మైన నది యొకఁడసుమీ. 90

తే. గీ. అనఘ! మోక్ష మదేహమైనను సదేహ
మైన విషయాశ్రయము గానిదగుట నిజము.
అట్లుగావున స్వర్గాదులందుఁ బోలె
హెచ్చుతగ్గులు కల్గ వందించుకేని. 91

వ. దేహంబుకలిమి భోగానుభవార్థంబ కావున సదేహదేహముక్తులకు భోక్తృత్వాభోక్తృత్వకృతం బగువిశేషం బుండు నందువేని

భోగంబులు సత్యంబులని నమ్మి భోక్తృత్వాభిమానంబునఁ దదను భవంబుఁ గాంచువారికిఁ దత్కృతం బగువిశేషం బుండునుగాని యసంగోదాసీనాత్మైకదర్శి యగువాని కట్టివిశేషంబు కలుగదు. 92

చ. అమలవిచార! యిప్డు మనయగ్రితలంబునఁ గూరుచున్న వ్యా
సమునివరుఁ డ్సదేహత నెసంగెడివానిగఁ గాంచుచున్న వా
రమా మన; మంతెకాని రుచిరం బగునీతనియంతరంగభా
వ మెఱుఁగనేర; మద్ది తలపంగ నితండు విదేహుఁడే యగుఁ. 93

ఆ. బోధరూపు లైనముక్తులయందు స
దేహు లనుచు మఱి విదేహు లనుచు
భేద మేమి కలదు? వీచుగాలి యొకండు
కదలకుండునట్టిగాలి యొకఁడె? 94

తే. గీ. నాకుఁగాని వ్యాసునకుఁగాని కలది స
దేహముక్తి యను, మదేహముక్తి
యనుము, ద్వైతశూన్య మాత్మైకతారూప
మైనయట్టిజ్ఞాన మది కుమార! 95

వ. మఱియు సదేహవిదేహబంధమోక్షాదివ్యవహారం బజ్ఞదృష్టియందకాని పరమార్థదృష్టియందు లేదు. ఇదియునుంగాక జ్ఞానంబునకు ఫలం బాత్మానుభవంబుగాని దేహపాతంబు గాదు. అయ్యది స్వవిరోధి యగునజ్ఞానంబును నశింపంజేయుఁగాని ప్రారబ్ధవశంబునం జేసి ధరియింపంబడుదేహంబున కెట్టిహానియుఁ గలిగింపదు. కావున ముక్తు లగువారికి దేహసంబంధ ముండఁగూడదని తలంపకుము. ఇంకఁ బ్రకృతవిషయం బెఱింగించెద. 96

క. కర్ణాభరణము సంసా
రార్ణవతారకము నజ్ఞతాంధ్యనిరాసో
దీర్ణము నీబోధము నా
కర్ణింపుము రామచంద్ర! ఘనగుణసాంద్రా! 97

—• పౌరుషవివరణము •—

ఆ. వె. చారుతరచరిత్ర! సంసారమునయందు
నెల్లవారిచేత నెల్లయవియు
సర్వకాలములను సమ్యక్ప్రయుక్తమౌ
పురుషకారముననె పొందఁబడును. 98

చ. పరమగుణాఢ్య! శాస్త్రహితపద్ధతిమైఁ గరణత్రయమ్మునన్
బురుషుఁ డొనర్చుకర్మముల బుద్ధి విశుద్ధిని బొందు, దానిచే
నెఱుక జనించు, దాన మది నిట్టిద యట్టి దనంగ రానిసౌ
ఖ్యరసము పొంగుఁ, బూర్ణశశియం దమృతం బుదయించుచాడ్పునన్.

వ. ఇది పురుషయత్నైకసాధ్యంబుగాని యితరంబు గాదు. దైవప్రాతి
కూల్యంబునఁ బురుషకారం బెట్లు ఫలియించునని యనుమానింప
కుము. నిజంబునకు దైవంబనఁ బ్రత్యక్షంబుగాఁ గానుపింపని పౌరు
షంబునకంటె నన్యంబు గాదు. అయ్యది మోహగ్రస్తు లగుమంద
మతులచేతఁ గల్పింపంబడినదియే కాని వాస్తవంబున లేదు. 100

తే. గీ. పౌరుషం బన బుధజనుల్ వలికినట్టి
సరణిఁ గరణత్రయమ్మున నరుఁ డొనర్చు
కర్మ మేసుమి, అదె ఫలకారియు నగు
నన్య మున్మత్తచేష్టితంబ యగు రామ! 101

మ. ఎవఁ డేయర్థము గోరి యందుకొఱకై యేవేళ సాధూపది
ష్టవిధిన్ యత్నమొనర్చుఁ దత్ఫల మవశ్యం బందు నాతండు ప
ట్టు విడంబోవఁడ యేని మధ్యమున; నట్టుల్ గానఁ గార్యైకదీ
క్ష వహింపందగు నాఫలోదయము విఘ్నంబుల్ నిరోధించుచున్.

సీ. త్రైలోక్యవిభవసుందర మైనయింద్రత్వ
మొక్క శరీరి తా నొందుటయును
ఫుల్లాంబుజమునఁ జిదుల్లాసత వసించి
యొకజీవి బ్రహ్మత్వ మొందుటయును
గరుడధ్వజంబుఁ జక్రముఁ దాల్చి యొకదేహి
పురుషోత్తమత్వంబుఁ బొందుటయును
బాలేందుమౌళియై భామార్ధదేహియై
యీశత్వ మొకప్రాణి యొనయుటయును

తే. గీ. తలఁప బురుషప్రయత్నంబువలనఁగాక
యన్యమునఁగాదు. కావున నవనియందుఁ
బౌరుషంబున సాధింపఁబడనియట్టి
వస్తు వొక్కండు లేకున్కి వాస్తవంబు. 103

వ. పౌరుషంబు ప్రాక్తనంబు నైహికం బను భేదంబుల ద్వివిధంబుగా నెఱుంగుము. ప్రాక్తనపౌరుషం బద్యతనపౌరుషంబుచే నవశ్యంబు జయింపంబడు. నిరంతరప్రయత్నపరులును దృఢాభ్యాసకులును బ్రజ్ఞోత్సాహసమన్వితులును నగుపురుషులు మేర్వాదిపర్వతంబుల నేనియుఁ గబళింపంజాలుదురనఁ బ్రాక్పౌరుషంబు జయింపఁజాలుదు రని వేఱ చెప్పవలయునే ? 104

తే. గీ. శాస్త్రనియమిత మగుపురుషప్రయత్న
మవనిఁ బురుషుల కొడఁగూర్చు నభిమతముల
నట్లు గాకిచ్చవచ్చినయటు లొనర్చు
పను లనర్థంబు లెన్నేనియును ఘటించు. 105

వ. రామచంద్రా! స్వల్పబలధనబుద్ధ్యాదియుతు లగువారికి మహాబల ధనబుద్ధ్యాదులు గలవారిచే సాధింపందగుపౌరుషఫలలాభం బెట్లు కలుగు నని శంకింపవలదు. అట్టిమహాబలధనాదిసంపన్నులుసయిత మొకప్పుడు శాస్త్రవిహితప్రయత్నహీను లయి దుర్దశ లనుభవించి క్రమంబునఁ బౌరుషపరంపరలవలన నాజన్మమందుఁగాని జన్మాంతరంబునంగాని తల్లాభంబు వడసియుందురు. విధివిహితయత్నంబు సేయక దుర్దశ లనుభవించువార లల్పభోగంబులం దృప్తిం బొంది యవియ మహాభాగ్యంబుగాఁ బరిగణింతురు. 106

తే. గీ. ఒక్కదుర్దశఁ బుడిసిటియుదకలవము
భూరిభోగంబుగా నెంచి పొంగునరుఁడె
భాగ్యదశయందు ద్వీపసప్తకముఁ దనదు
పుత్త్రులకుఁ బంచుచుఁ స్వల్పముగఁ దలంచు. 107

వ. అని పలికి వసిష్ఠుండు వెండియు నిట్లనియె. 108

తప్పించుకొనుచు నామె తలుపుగడియ రాకుండఁ గాపాడుచుఁ దలుపులీయ నుంకించిన నలుగురిని ఖడ్గధార కెరచేసెను. ఇట్లొకజా మాఁపఁగలిగెను. చోరులలో నలుగురు మడిసిరి. అంతట వారు భయభ్రాంతులై పాఱిపోయిరి. ఇంతకాలమును అజమీందారుగారు స్మృతితప్పి మంచముక్రిందనే పడియుండిరి. ఏమిజరిగినదియు నాయన యెఱుఁగఁడు. చోరులు పారిపోయిన ట్లెఱిఁగి యీ మానిని స్థైర్యమూని తలుపు తెఱచి సేవకులలోఁ బెక్కండు గ్రిహతులగుటకుఁ జింతించి భర్తకు శీతలోపచారము లొనర్చి మానప్రాణములు కాపాడఁగలి గెను.”

ఇది నిశ్చయముగ మనతరమున జరిగిన గాథ. ఇందెంతమాత్రమును సంశయము లేదు. పృథ్వీరాజు భార్య సుమారు 25 యేండ్ల వయస్సుగల రాణి సంయుక్త పురుషవేష మూని యుద్ధరంగమున కశ్వారూఢయై యరిగి భర్తకుఁ దెలియకుండ సాయపడి యుద్ధమొనరించెను. ఇంతదూర మేల? నరకాసుర వధయందు శ్రీకృష్ణునకు సత్యభామ, శంబరసంగరకాలమున దశరథునకుఁ గైకేయి యుద్ధమొనర్చియు రథచోదకత్వము నెఱపియు సాయపడినట్లు మనగ్రంథములే చాటుచున్నవి. వింటిరా. స్త్రీ లెంతలెంతలు చేసి పన్నె గాంచిరో!

ఇంతియే కాదు. భర్త యుద్యమమున కెల్లఁ దోడ్పడి కొనసాగువఱకు వెను దీయక సాయమొనర్చి సహధర్మచారిణి యను పేరు గాంచును. సత్యవాఙ్నియమ విధేయతలతోఁ గూడి నిర్మలాంతఃకరణము గలిగి భర్తను వలచి వలపించుకొను భార్య తన గృహమును భూతలస్వర్గ మొనరించును. కుటుంబ మెల్లలోకమునకు మార్గదర్శక మగునట్లు చేయును. దేశోద్ధరణ మెన్నటికైన నుత్తమస్త్రీసంతతిచేఁ గాఁగలదు గాని కేవల పురుషప్రయత్న మెంతవిరివిగ జరిగినను గాఁజాలదు.

జగ:- రాఁగా రాఁగా నీవు సృష్టియంతయు నాడవాండ్రదే గాని మగవాండ్రదేమియు లేదనుచున్నావే?

కృష్ణా:- నే నట్లు చెప్పుచుండలేదు. భార్యతోడ్పాటు లేక పురుషుఁ డెంత ప్రజ్ఞాశాలి యయ్యును మహాకార్యము లొనరించుట దుష్కరము- స్త్రీసహకార ముండిన చోఁ గార్యసిద్ధి సులభము- దిన మొక యభ్యాగతున కన్న మిడఁదలఁచినపురు షుఁడు తన యిల్లా లనుమతించినఁగాని యాపని సాగించఁజాలఁడు. కావుననే యొక కవి

ఆ. వె. కోటసింగరాజు మాటవాసియె కాని
గంగమాంబచేత ఘనతఁగాంచె;
గంగమాంబ మిగుల గయ్యాళి యైనచో
సింగరాజుకేమి చేయఁగలఁడు! ...

అన్నాఁడు. వా రెవరో మన మెఱుఁగము. మాట యెంతకాలమునుండి నిలిచి యున్నదో చూడుఁడు. భార్య భర్తయర్ధశరీరమని యెల్లదేశములవారును జెప్పుచున్నారు. కాన వారు భేదభావము లేక సర్వప్రయత్నముల నేకముగఁ బ్రవర్తించుచు భార్యాభర్త లనునామము సార్థకపఱచవలెను. భార్యయన భరింపఁబడునది. భర్త యన భరించువాఁడు. ఒక కుటుంబమున నిద్దఱు యజమానులుండిన నది చక్కఁగ సాఁగనేరదు. కాన (రాజు మంత్రివలె) యజమానుఁడు భర్తగను భార్య తత్సాహాయ్యకారిణిగను సర్వదేశములవారు నంగీకరించియున్నారు. భర్తకంటె భార్య విద్యారూపగుణములం దాధిక్యము కలిగి యుండినను రాజు కడ నుండు మంత్రివలె నడఁకువ కలిగియుండి తన తెలివితేటలచే లోపములు వెలఁవడనీక కమ్ముకొనివచ్చుచుండవలెను.

భర్త కోపగించినను గొట్టినను దుష్కార్యమొనరించుచున్నను సహించి త్వరపడక సమయము వేచి శాంతపఱచి మంచిమాటలు చెప్పియు నిదర్శనములగు వృత్తాంతముల నెత్తియు నతని లోపముల సవరించుకొనునట్లు చేయుచుఁ బ్రీతికరములగు నాలాపముల నెత్తి శాంతికలిగించి సుఖము నాపాదించవలెను.

జగ:- నీ విన్నిమాటలు చెప్పితివా. మనము చెవి నిల్లు కట్టుకొని పోరినఁగాని మగవారింతమాత్రమైనను గొఱఁతలు తీర్చరు. నీ కాయనుభవము లేదు. తుదకు ముక్కుపుడకైనను జేయించిపెట్టరు. నీ కాసంగతి యింకను దెలియకుండ నున్నది.

కృష్ణా:- ఈవిషయములో మీమాటలకు నే నెదురుచెప్పలేను. కాని పదుగురు నగలు పెట్టుకొని యొకరికి లేనపుడు కొఱఁతగఁ దోఁచునుగాని యందఱికిని లేకుండినను మొదటినుంచి నగలు దాల్చకుండినను లోపము కానరాదు. నిజమైన యలంకారము సుగుణపుంజముచేఁ గలుగునుగాని నగలవలన వస్త్రములవలనఁ గలుగదనియే నానమ్మకము. వస్త్రాభరణాలంకారము తాత్కాలికమే యనియు సుగుణాలంకారము శాశ్వతమనియు మనము చదివియుంటిమికద! ఈమాట లెఱుఁగక యనేకులు వస్త్రాభరణాదులకొఱకు భర్తలఁ బీడించుచుందురు. ఇట్లు పీడించువారికి సుగుణసంపత్తి యేమైన నుండిన నది యడుగంటును. ఉత్తమాలంకారముం గోరువా రీవిషయము జ్ఞాపకమునం దుంచుకొని తమ భర్తలు బుద్ధిపూర్వకముగ నిచ్చిన వస్త్రాభరణములఁ దుష్టినందుచుఁ గుటుంబమునెల్లఁ దమ సంతసముచే నలరించుచుండవలెను. ఎంతవెలగలసొమ్ములైనను జీరలైనను రూపహీనుల నందగించఁజాలవు. కాని సుగుణపుంజము మాత్ర మెట్టివారినేని స్వయంజ్యోతివలె నలరఁజేయఁగలద"ని పలుమఱు చదివియు వినియు నుంటిమి. అది నిజముకావుననే గ్రంథములం దీవిషయములు పలుమాఱు నొక్కి వక్కాణింపఁబడినది. అసత్య మింతకాలము నిలువదు. నిలిచిన నది సద్గ్రంథములం జేరనేరదని మనము నిశ్చయముగఁ దెలిసికొనఁదగిన విషయము.

జగ:- మనకు జాతివాండ్రవలె లంగాలు తొడిగికొని సొమ్ములు లేకుండ నిష్టమువచ్చినట్లు తిరుగవలెనని యభిప్రాయము. వాండ్రవలె మనము స్వాతంత్ర్య మెక్కడఁ దేఁగలము ?

క్రిష్ణా:- వారివలె మనము బహిరంగముగ నిచ్చవచ్చినచోటికెల్ల వెళ్ళవలెనని కాని మనయిండ్లయందు మన కిప్పుడున్నదానికంటె నధికస్వాతంత్ర్యము కోరఁదగిన దనికాని కాదు. మనయాచారములంబట్టి చూచిన మన కిప్పు డుండఁదగిన స్వాతంత్ర్యము లేకపోను లేదు. ఎంతవఱ కుచితమో యంతవఱకు మన పూర్వులే మనకు స్వాతంత్ర్యము కలిగించియున్నారు. మనయాచారాదులం జక్కఁగ నెఱుఁగనివారు దలంచుచుండినట్లు మనవారు మనను బానిసలవలె నిర్బంధించుచుండలేదు. పురుషుఁ డార్జించి యిల్లుచేర్చిన పదార్థముల నెల్లఁ దగురీతి వెచ్చించుటకు స్వాతంత్ర్యము కలిగియుండుటే కాక పదార్థములు సంపాదించిన భర్తకంటెను నిల్లాలి కధికస్వాతంత్ర్యము కలదని చెప్పిన నది యతిశయోక్తి కాదు. మనదేశమున స్త్రీ లెల్లరును గృహకృత్యములందును శిశుసంరక్షణమునందును బతిశుశ్రూషణమునందును గాలము గడపవలసినవా రగుచున్నారు. ఈపనులయందు వారిమన సెప్పుడును లగ్నమై యుండుటచే నవి లేనివారి కలవడు దుర్వ్యాయామములందును బరదూషణాదులందును గాలము గడపుటకు వీరి కవకాశము లేకుండును. మనదేశపు టాచారముల బొత్తుగ నెఱుఁగని దేశాంతరవాసు లెల్లరును మన స్త్రీల కేమాత్రము స్వాతంత్ర్యములు లేవనియు నిర్బంధము లధికమనియుఁ దలంచుచుందురు. వారు నిజ మెఱుఁగఁజాలనందున నిట్లు తలంచుట కలుగుచున్నది. దేశాంతరములం దున్నదానికంటెను మతాంతరులం దున్నదానికంటెను మన స్త్రీల స్వాతంత్ర్యమే యధికమని బాగుగ విచారించినఁ దెలియఁగలదు మన శుభాశుభ యజ్ఞయాగాది మహాకార్యములందు భార్య్య సహచారిణిగ నుండనిది చేయ వలనుపడదు. అన్నికార్యములందును ముందుగ స్త్రీని గౌరవించి యనంతరము పురుషుని గౌరవించెదరు. వేదమంత్రములందును స్త్రీగౌరవమే ప్రాథమికము. 'మాతృదేవో భవ' యని కాని 'పితృదేవో భవ' యని యనరు. ఈశ్వరారాధనమందును లక్ష్మీనారాయణులనియుఁ బార్వతీపరమేశ్వరులనియు వాణీహిరణ్యగర్భులనియు వాడుదురు. తుదకు వాడుకమాటలందును దలిదండ్రులనియు భార్యాభర్తలనియు వధూవరులనియు వాడుదురు. మాటలుమాత్రమే యట్లున్నవని తలంచిన నట్లుకాదు. క్రియాకలాపమందును బ్రథమగౌరవము స్త్రీలకే యొసంగఁబడియున్నది. ఎంతవిద్వత్సభయం దైనను గార్యమధ్యమున మగపిల్ల లెప్పుడేని పెద్దలకు నమస్కరించవలసియుండిన దారు ముందుగఁ దల్లికి నమస్కరించక యొరులకుఁ జేయఁగూడదను నియమము మనము దినదినముఁ జూచుచుంటిమి. కానుకలు చదివించునప్పుడును ముందుగ మనకే చదివించి యనంతరము పురుషులకుఁ జదివించెదరు. సభాస్థలియందుఁ బీఁటల

మీఁదఁ గూర్చుండవలసినప్పు డందఱు సభాస్తారులకంటె మన కుచితస్థానము లిచ్చుచుందురు. మంగళహారతులును మనమే పాడి కార్యాంత్యశుభముల నాపాదించుచుందుము. తఱచు కలుగుచుండు బాధలు లేక క్రిస్టియను స్త్రీలకు వలె స్వేచ్ఛావిహారముగాని మహమ్మదీయ స్త్రీలకువలె నంతఃపురబంధముగాని లేక మనము యథోచితమార్గవర్తులమై వారివారి యాచారములచే వారి సుఖాధిక్యము నందుచున్నామని తలంచుట కెంతమాత్రము సంశయములేదు. ఆంగ్లేయ స్త్రీల యందును బతివ్రతలు లేకపోలేదు. కాని వారి దాంపత్యవివాదములు నభియోగములు నాత్మహత్యలు స్త్రీపురుషులు వివాహమాడఁగూడదని భీష్మించుటలు మనయాచారములం దిప్పటివఱకుఁ బొడమూపలేదు. మన పురుషులు తఱచుగ వారివలె జుట్టు బొట్టు వదలి లాగు చొక్కాలు ధరించి తిరుగుచున్నట్లు మనమును బొట్టు కాటుక మాని లంగా జాకెట్లు తొడిగి వెలిదిరిగినప్పు డిట్టి దుర్దశ మనవారికిని సంభవించక తప్పదు.

జగ:- ఇంతదూరము చెప్పితివి. సరే కాని స్త్రీలతోపాటు పురుషులకుఁగూడఁ బాతివ్రత్యమని చెప్పితి వది యేమి? పురుషులలోఁగూడ నది యున్నదా యేమి? నే నెన్నఁడు వినలేదు.

కృష్ణా:- స్త్రీలకుఁ బాతివ్రత్య మెట్టి మాహాత్మ్యదాయియగు విధియో పురుషుల కేకపత్నీవ్రత మట్టిది. ఇందుకు సందియము లేదు. కాని పురుషు లిది మనదేశ మం దంతగఁ బాటించుట లేదు. శ్రీరామచంద్రమహాప్రభుఁ డీనియమ మాచరించి యాచంద్రార్క ఖ్యాతి నందియున్నాఁడు. స్త్రీల కెపుడును గర్మాధికారము లేదు. పురుషుని ధర్మపత్నిగ నుండి యతఁ డాచరించు పుణ్యకర్మముల యం దర్ధఫల మనుభవించును. వితంతు లెట్లు శుభాదుల నయోగ్యలో యటులనే యపత్నీకులును. వారును గర్మాచరణాధికారము లేకుందురు. కర్మసిద్ధికొఱకును బుత్రులు లేనివారికి గతి లేకుండుటను నపుత్రవంతుఁడు పుత్రవంతుఁడగుటకుఁ బురుషపునర్వివాహము పక్షాంతరముగ ధర్మశాస్త్రము లొప్పికొనుచున్నవి. కావునఁ బుత్రవంతుఁడై యుండియుఁ గర్మ లాచరించు నిశ్చయము లేకయుఁ బునర్వివాహ మొనరించుకొను పురుషుఁడు శాస్త్రదృష్టియందుఁ బునర్వివాహ మొనరించుకొనిన వితంతులకంటె నధికుఁడు కాఁడు. లోకాచారములవెంట నది యంత గర్హ్యముగ జనసామాన్యమునకుఁ దోఁచుచుండలేదు. శౌర్యపౌరుషములును ధైర్యస్థైర్యములును గలిగి విషయేచ్ఛ లేక వర్తించఁగలవారలే పురుషోత్తములు. ఇట్లుగాక బుద్ధిచాంచల్యమునకు లోఁబడి యిచ్ఛవచ్చినట్లు వ్యభిచరించువారు కుక్కలకంటె నీచులై దేశనాశన మొనరించు పాపిష్ఠులని చెప్పనగును. ఇట్టి దుర్భగులు తాము చెడియుఁ దనేతోత్తమాంగనలఁ జెఱచియుఁ బసుల్కులనాశన కారులై దేశక్షోభ మొనరింతురు.

## —• శ్రీశంకరాచార్యాష్టోత్తరశతనామావళి •—

ఏతాదృశ స్తోత్రములే కాదు. శివకేశవులంబోలె దివసదివసమును పూజించుట కనువగు నామావళులే యాశిష్యులచే నాచరితములు. శివుఁడే వచ్చి శంకరాచార్యావతార మెత్తియుండుటచే నందుల కాశ్చర్యపడ నవసరము లేదు. అం దష్టోత్తరశతనామావళి క్రిందఁ బొందుపఱచుచున్నవాఁడను.

శ్లో. శ్రీశంకరాచార్యవర్యో బ్రహ్మానందప్రదాయకః
అజ్ఞానతిమిరాదిత్య స్సుజ్ఞానాంబుధిచంద్రమాః 1
వర్ణాశ్రమప్రతిష్ఠాతా శ్రీమాన్ ముక్తిప్రదాయకః
శిష్యోపదేశనిరతో భక్తాభీష్టప్రదాయకః 2
సూక్ష్మతత్త్వరహస్యజ్ఞః కార్యాకార్యప్రబోధకః
జ్ఞానముద్రాంచితకర శ్శిష్యహృత్తాపహారకః 3
పారివ్రాజ్యాశ్రమోద్ధర్తా సర్వతంత్రస్వతంత్రధీః
అద్వైతస్థాపనాచార్య స్సాక్షా చ్ఛంకరరూపభృత్ 4
షణ్మతస్థాపనాచార్య స్త్రయీమార్గప్రకాశకః
వేదవేదాంతతత్త్వజ్ఞో దుర్వాదిమతఖండనః 5
వైరాగ్యనిరత శ్శాంత స్సంసారార్ణవతారకః
ప్రసన్నవదనాంభోజః పరమార్థప్రకాశకః 6
పురాణస్మృతిసారజ్ఞో నిత్యతృప్తో మహాన్ మునిః
నిత్యానందో నిరాతంకో నిస్సంగో నిర్మలాత్మకః 7
నిర్మమో నిరహంకారో విశ్వవంద్యపదాంబుజః
సత్త్వప్రధాన స్సద్భావ స్సంఖ్యాతీతగుణోజ్జ్వలః 8
అనఘ స్సారహృదయ స్సుధీ స్సారస్వతప్రదః
సత్యాత్మా పుణ్యశీలశ్చ సాంఖ్యయోగవిచక్షణః 9
తపోరాశి ర్మహాతేజా గుణత్రయవిభాగవిత్
కలిఘ్నః కాలకర్మజ్ఞ స్తమోగుణనివారకః 10
భగవాన్ భారతీజేతా శారదాహ్వానపండితః
ధర్మాధర్మవిభాగజ్ఞో లక్ష్యభేదప్రదర్శకః 11
నాదబిందుకళాభిజ్ఞో యోగిహృత్పద్మభాస్కరః
అతీంద్రియజ్ఞాననిధి ర్నిత్యానిత్యవివేకవాన్. 12

శ్లో. చిదానంద శ్చిన్మయాత్మా పరకాయప్రవేశకృత్
అమానుషచరిత్రాఢ్యః క్షేమదాయీ క్షమాకరః 13
భవ్యో భద్రప్రదో భూరిమహిమా విశ్వరంజకః
స్వప్రకాశ స్సదాధారో విశ్వబంధు శ్శుభోదయః 14
విశాలకీర్తి ర్వాగీశ స్సర్వలోకహితోత్సుకః
కైలాసయాత్రాసంప్రాప్తచంద్రమౌళిప్రపూజకః 15
కాంచ్యాం శ్రీచక్రరాజాఖ్య యంత్రస్థాపనదీక్షితః
శ్రీచక్రాత్మకతాటంకతోషితాంబామనోరథః 16
శ్రీబ్రహ్మసూత్రోపనిషద్భాష్యాది గ్రంథకల్పకః
చతుర్దిక్చతురామ్నాయప్రతిష్ఠాతా మహామతిః 17
ద్విసప్తతిమతోచ్ఛేత్తా సర్వదిగ్విజయప్రభుః
కాషాయవసనోపేతో భస్మోద్ధూళితవిగ్రహః 18
జ్ఞానాత్మకైకదండాఢ్యః కమండలు లసత్కరః
గురుభూమండలాచార్యో భగవత్పాదసంజ్ఞకః 19
వ్యాససందర్శనప్రీతః ఋష్యశృంగపురేశ్వరః
సౌందర్యలహరీముఖ్య బహుస్తోత్రవిధాయకః 20
చతుష్షష్టికలాభిజ్ఞో బ్రహ్మరాక్షసతోషకః
శ్రీమన్మండనమిశ్రాఖ్య స్వయంభు జయసన్నుతః 21
తోటకాచార్యసంపూజ్యః పద్మపాదార్చితాంఘ్రికః
హస్తామలకయోగీంద్ర బ్రహ్మజ్ఞానప్రదాయకః 22
సురేశ్వరాఖ్యసచ్ఛిష్య సన్న్యాసాశ్రమదాయకః
నృసింహభక్త స్సద్రత్నగర్భహేరంబపూజకః 23
వ్యాఖ్యాసింహాసనాధీశో జగత్పూజ్యో జగద్గురుః
ఇతి శ్రీశంకరార్యస్య సర్వలోకగురోః పరం 24
నామ్నా మష్టోత్తరశతం భుక్తిముక్తిఫలప్రదం
త్రిసంధ్యం యః పఠే ద్భక్త్యా సర్వాన్కామా నవాప్నుయాత్

ఓం శ్రీ శంకరాచార్యవర్యాయ నమః
బ్రహ్మానందప్రదాయకాయ నమః
అజ్ఞానతిమిరాదిత్యాయ నమః
సుజ్ఞానాంబుధిచంద్రమసే నమః
ఓం వర్ణాశ్రమప్రతిష్ఠాత్రే నమః ౧
శ్రీమతే నమః
ముక్తిప్రదాయకాయ నమః
శిష్యోపదేశనిరతాయ నమః

ఓం భక్తాభీష్టప్రదాయకాయ నమః
సూక్ష్మతత్త్వరహస్యజ్ఞాయ నమః 10
కార్యాకార్యప్రబోధకాయ నమః
జ్ఞానముద్రాంచితకరాయ నమః
శిష్యహృత్తాపహారకాయ నమః
పారివ్రాజ్యాశ్రమోద్ధర్త్రే నమః
సర్వతంత్రస్వతంత్రధియే నమః 15
అద్వైతస్థాపనాచార్యాయ నమః
సాక్షాచ్ఛంకరరూపభృతే నమః
షణ్మతస్థాపనాచార్యాయ నమః
త్రయీమార్గప్రకాశకాయ నమః
వేదవేదాంతతత్త్వజ్ఞాయ నమః 20
దుర్వాదిమతఖండనాయ నమః
వైరాగ్యనిరతాయ నమః
శాంతాయ నమః
సంసారార్ణవతారకాయ నమః
ప్రసన్నవదనాంభోజాయ నమః 25
పరమార్థప్రకాశకాయ నమః
పురాణస్మృతిసారజ్ఞాయ నమః
నిత్యతృప్తాయ నమః
మహతే నమః
మునయే నమః 30
నిత్యానందాయ నమః
నిరాతంకాయ నమః
నిస్సంగాయ నమః
నిర్మలాత్మకాయ నమః
నిర్మమాయ నమః 35
నిరహంకారాయ నమః
విశ్వవంద్యపదాంబుజాయ నమః
సత్త్వప్రధానాయ నమః
సద్భావాయ నమః
సంఖ్యాతీతగుణోజ్జ్వలాయ నమః 40
అనఘాయ నమః
సారహృదయాయ నమః

ఓం సుధియే నమః
సారస్వతప్రదాయ నమః
సత్యాత్మనే నమః 45
పుణ్యశీలాయ నమః
సాంఖ్యయోగవిచక్షణాయ నమః
తపోరాశయే నమః
మహాతేజసే నమః
గుణత్రయవిభాగవిదే నమః 50
కలిఘ్నాయ నమః
కాలకర్మజ్ఞాయ నమః
తమోగుణనివారకాయ నమః
భగవతే నమః
భారతీజేత్రే నమః 55
శారదాహ్వానపండితాయ నమః
ధర్మాధర్మవిభాగజ్ఞాయ నమః
లక్ష్యభేదప్రదర్శకాయ నమః
నాదబిందుకలాభిజ్ఞాయ నమః
యోగిహృత్పద్మభాస్కరాయ నమః
అతీంద్రియజ్ఞాననిధయే నమః
నిత్యానిత్యవివేకవతే నమః
చిదానందాయ నమః
చిన్మయాత్మనే నమః
పరకాయప్రవేశకృతే నమః 65
అమానుషచరిత్రాఢ్యాయ నమః
క్షేమదాయినే నమః
క్షమాకరాయ నమః
భవ్యాయ నమః
భద్రప్రదాయ నమః 70
భూరిమహిమ్నే నమః
విశ్వరంజకాయ నమః
స్వప్రకాశాయ నమః
సదాధారాయ నమః
విశ్వబంధవే నమః 75
శుభోదయాయ నమః

ఓం విశాలకీర్తయే నమః
వాగీశాయ నమః
సర్వలోకహితోత్సుకాయ నమః
కైలాసయాత్రాసంప్రాప్త-
చంద్రమౌళిప్రపూజకాయ నమః 80
కాంచ్యాం శ్రీచక్రరాజాఖ్య-
యంత్రస్థాపనదీక్షితాయ నమః
శ్రీచక్రాత్మకతాటంక-
పోషితాంబామనోరథాయ నమః
శ్రీబ్రహ్మసూత్రోపనిషత్-
భాష్యాదిగ్రంథకల్పకాయ నమః
చతుర్దిక్చతురామ్నాయప్రతిష్ఠాత్రే నమః
మహామతయే నమః 85
ద్విసప్తతిమతోచ్ఛేత్రే నమః
సర్వదిగ్విజయప్రభవే నమః
కాషాయవసనోపేతాయ నమః
భస్మోద్ధూళితవిగ్రహాయ నమః
జ్ఞానాత్మకైకదండాఢ్యాయ నమః 90
కమండలులసత్కరాయ నమః
గురుభూమండలాచార్యాయ నమః
ఓం భగవత్పాదసంజ్ఞకాయ నమః
వ్యాససందర్శనప్రీతాయ నమః
ఋశ్యశృంగపురేశ్వరాయ నమః 95
సౌందర్యలహరీముఖ్య-
బహుస్తోత్రవిధాయకాయ నమః
చతుష్షష్టికలాభిజ్ఞాయ నమః
బ్రహ్మరాక్షసతోషకాయ నమః
శ్రీమన్మండనమిశ్రాఖ్య-
స్వయంభుజయసన్నుతాయ నమః
తోటకాచార్యసంపూజ్యాయ నమః
పద్మపాదార్చితాంఘ్రికాయ నమః
హస్తామలకయోగీంద్ర-
బ్రహ్మజ్ఞానప్రదాయకాయ నమః
సురేశ్వరాఖ్యసచ్ఛిష్య-
సన్న్యాసాశ్రమదాయకాయ నమః
నృసింహభక్తాయ నమః
సద్రత్నగర్భహేరంబపూజకాయ నమః
వ్యాఖ్యాసింహాసనాధీశాయ నమః
జగత్పూజ్యాయ నమః
ఓం జగద్గురవే నమః 108

భరతఖండ మంతటను వర్ణాశ్రమాచారవ్యవస్థాపకముగా శంకరాచార్యులు పీఠములు నిల్పిపోయిరి. పద్మపాదంచ హస్తామలకంచ శిష్యం తం తోటకం వార్త్తికకారమని తత్సాత్తాన్ముఖ్యశిష్యు లీనలుగురే యైనట్లు తఱచు కనుపట్టెడిని. 5 పీఠములకు నలుగు రెట్లు సరిపోవుదురను విచికిత్స యటుండఁ గాంచీ శృంగగిరి ద్వారకల మూడింటను సురేశ్వరాచార్యులే ప్రథమపీఠాధిపతులైనట్లు వారివారి పరంపరలు వాకొనుచున్నవి. శృంగగిరిపీఠమునకుఁ జేరినది మనదేశము. ఆపరంపరయే యాధారముగాఁ దీసికొని యవల నరుగుదము. కాని యటఁగూడ నొక సంశయ మంకురించెడిని. విద్యారణ్యులు సురేశ్వరాచార్యుల తరువాత 10వ పురుషుఁడని శృంగగిరిపీఠగురుపరంపరలోను 9వ పురుషుఁడని విరూపాక్షపీఠగురుపరంపరలోను గనఁబడుచున్నది. ఎన్నవపురుషుఁడో యగుఁగాక. ఆమహానుభావుని వ్యాఖ్యాయికగూడ యథాశ నరయుందము.

౧ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి.
౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల.
౪ తిరుమలనల్లాన్ చక్రవర్తివరదాచార్యుల అయ్యవార్లంగారు, శాంతాపురము
౫ రాయచూరి బందేరావుగారు, అయినాపురము.
౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.
౭ చిక్కరాజు మట్టపల్లిరావుగారు - చెలకుర్తి.
౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు ఏజంటు.
౯ అద్దంకి ... తిరువేంగడతాత దేశికాచార్యులయ్యవార్లంగారు. తక్కెళ్ళపాడు.
౧౦ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౧౧ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.
౧౨ పరిటాల వెంకటేశ్వరరావు దేశముఖుగారు, పులిగెళ్ళ.
౧౩ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.
౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.
౧౫ వడ్డిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి.
౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణికాలరీసు.
౧౭ మారేపల్లి వెంకటకిషన్‌రావు, మాధవరావు దేశముఖుగార్లు కాకర్లపల్లి.
౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.
౧౯ మద్దూరి సాంబయ్యగారు - పొగాకుకంపెని - పరుచూరు.
౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు కొత్తపల్లి.
౨౧ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, మల్లారెడ్డిపల్లె.
౨౨ మల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ.
౨౩ బీరవోలు రామచంద్రారెడ్డిదొరవారు, వెంకటరావుపల్లె.
౨౪ ఏలూరు మాణిక్యారావుగారు, గవిచెర్ల.

# అభినవసరస్వతి

సంపాదకుఁడు—నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు,
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది ద్వైమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాఖ్యానములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

## ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 నీతిగీతలు (సుమతిశతకము, చాణిక్యశ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 వాసంతికాపరిణయనాటకము | ... | 0 | 4 | 0 |
| 4 కరణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 7 స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 8 శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 9 సూతసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | 0 |
| 10 భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 11 ధర్మనిర్ణయము | ... | 0 | 4 | 0 |
| 12 అస్పృశ్యతానివారణఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 13 స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 14 డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 15 డిటో నాగరఖండము (౩ సంపుటము) | | 1 | 8 | 0 |
| 16 డిటో నాగరఖండము (౪ సంపుటము) | | 1 | 8 | 0 |
| 17 కల్హాటవీరచరిత్ర | | 0 | 12 | 0 |
| 18 భాగవతరహస్యములు | | 0 | 4 | 0 |
| 19 హాటకేశ్వరశతకము | | 0 | 2 | 0 |
| 20 జాతకచర్య (స్వీయచరిత్ర) | | 1 | 8 | 0 |
| 21 మధూకాంబరీవిడంబనము | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోష్టు,
గుంటూరు జిల్లా.